ఓం వేంకటేశ్వరాయ నమః

# ఉత్తర శ్రీనివాసము

## ప్రథమ భాగము



వెల్లపిల్ల బంగారేశ్వర శర్మ

ఓం వేంకటేశ్వరాయ నమః

# ఉత్తర శ్రీనివాసము
## ప్రథమ భాగము



చెళ్లపిళ్ల బంగారేశ్వర శర్మ

ప్రథమ ముద్రణము - 500 ప్రతులు

ప్రచురణ తేది 24 జూలై, 1989.



ముద్రణము : కోహినూర్ ప్రెస్, పెద్దాపురం.

వెల: అమూల్యము

ప్రతులకు:

చెళ్లపిళ్ల బంగారేశ్వర శర్మ,
శివాలయం వీధి,
పెద్దాపురం - 533 437.

Scanned with CamScanner

ఓం వేంకటేశ్వరాయనమః



శ్రీ చెళ్లపిళ్ల బంగారేశ్వర శర్మ

శ్రీమతి చెళ్లపిళ్ల లక్ష్మీనరసమ్మ

# విజ్ఞాపనము

శ్రీనివాస వివాహానంతరము జరిగిన సంఘటనములను కొన్నిటిని తీసికొని పద్యకావ్యముగా వ్రాయనెంచి అందలి కొంతభాగమును వ్రాసి ఉత్తర శ్రీనివాస ప్రథమ భాగముగా ప్రచురించితిని. దృష్టి లోపమువలన చక్షురక్షరసంయోగము సరిగా కలుగకుండుటచేత స్వల్పముగా తప్పులు పడియుండవచ్చును. వానిని ద్వితీయ ముద్రణమునందు సవరింపగలవాడను.

ఈ కావ్యమును వ్రాయుటలో, అచ్చుతప్పులను దిద్దుటలో సహకరించిన నా సతీమణి చి॥ సౌ॥ లక్ష్మినరసమ్మకు అభినందనములు. త్వరలో ఈ కావ్యముద్రణము చేయించిన శ్రీ జయంతి కృష్ణగారికి నా శుభాకాంక్షలు. ముద్రణము నిర్దుష్టముగా ఉండుటకు సహకరించిన చి॥ జయంతి సత్యవాణికి, చి॥ జయంతి లక్ష్మి ప్రసన్నకు నా ఆశీస్సులు.

ఇట్లు,
బుధజన విధేయుడు,
చెల్లపిళ్ల బంగారేశ్వర శర్మ.

ఓం శ్రీవేంకటేశాయనమః

అవిఘ్నమస్తు

# ఉత్తర శ్రీనివాసము

## ప్రథమ భాగము

### ప్రథమాశ్వాసము

శ్రీవసుధా మనోహరుడు సింగియెలుంగున సోదెచెప్పి ప
ద్మావతి పెండ్లియాడిన విధంబు కథారచనం బొనర్చితిన్
శ్రీవృషభాద్రి కృష్ణమహిమ చెప్పుటకున్ జతనంబు చేయుదున్
దేవుడు వేంకటేశ్వరుడె తీర్చు నభీష్టము సత్కృపాబ్ధియై. 1

అని భజింపనర్హుడగునట్టి గణాధిపు దన్నపూర్ణకున్
గాదిలిపట్టియయిన గుణగణ్యుడు భవ్య గజాననుండు లం
బోదరు డేకదంతుడు మహోన్నత భావసమర్థశబ్ద భా
గ్యోదయమున్ ఘటించుత మదుత్తర వేంకటనాథ సత్కథన్. 2

తిరువానూరున దేవతాలయమునన్ దివ్యాకృతిన్నిల్చి భ
క్తిరసోద్రేకముతోడ గొల్చుజనులన్ తృప్తాత్ములన్ జేయుచున్
వరముల్ పెక్కడనిచ్చిపోషించుజననిన్ బద్మావతీదేవి నే
నిరతమ్మున్ భజియింతు కావ్యరచనానేకార్థ శబ్దార్థినై. 3

అన్నపూర్ణార్ధ దేహాప్రాప్త శృంగార
రసమూర్తి విశ్వేశ్వరప్రభుండు
బాలాత్రిపుర సుందరీలోలనేత్ర రా
జీవద్వయుడు చంద్రశేఖరుండు
జయభద్రకాళికా సౌందర్య సంపన్న
హృదయుండు వీరభద్రేశ్వరుండు
రమణీయభక్తి యోగధ్యానగోచర
రాజరాజేశ్వరీ రాజవదన

ఈశ్వరాశ్రియవరదనందీశ్వరుం డ
భీష్టసంధానచతురచండీశ్వరుండు
వేంకటాచలమాహాత్మ్య విషయరచన
మందగింతురుగాక నాయందు నుండి. 4

పాయనిభక్తితో నతిశుభప్రదమైన వ్రతంబు శ్రద్ధగా
జేయుధరానివాసుల కశేషకృపామతినెల్లవేళలన్
శ్రేయముగూర్పనున్నవర పృథ్విపురంబుననున్న సత్యనా
రాయణమూర్తిగొల్తు సుఖరంబుగ కావ్యము నిర్వహింపగన్. 5

ప్రజలబ్రోచుచు పెద్దాపురంబునందు
అతిపురాతనదేవాలయంబులోన
నున్న మరిడీమహాలక్ష్మి సన్నుతింతు
నుత్తర శ్రీనివాసకావ్యోదయమున. 6

పురజనుం సదయుఁబ్రోచెడు
తిరుపతిగంగమ్మతల్లి స్థిరభక్తినెదన్
నిరుపమశబ్దనిపుణతన్
తిరుపతిమాహాత్మ్య రచననెరపం గొలుతున్. 7

సీతామనోభిరామున్
భూతలసుత్రాము సమరభూమిభీమున్
చేతులు మోడ్చి భజించెద
ప్రీతిజనకశబ్దభావవృద్ధి ఘటింపన్. 8

వజ్రికవచ కిరీటభాస్వత్ప్రభునకు
న్యాయ సాంకేతికాది విద్యాప్రవీణ
సత్కళాపూర్ణ విజ్ఞానశాస్త్రనిపుణ
సరసవిశ్వవిద్యాలయ స్థాపకునకు. 9

అంకితమ్ముగానాయొనర్పంబూనిన యుత్తర శ్రీనివాస
కావ్యంబునకు కథాక్రమంబెట్టిదనిన 10

శ్రీనివాసకళ్యాణచరిత్ర జెప్పి
సూత పౌరాణికశ్రేష్ఠ శ్రోతలనల
రించినా వింకనుత్తరశ్రీనివాస
కథ వినిపింపుమని శౌనకాదిమునులు 11

సూతు నర్థింపనాతండు శుభకరమగు
నుత్తరశ్రీనివాసమ్ము యోగివరుల
కనుపమానందదాయకంబగు విధమున
భక్తిపారవశ్యమున జెప్పందొడంగె. 12

నిజనివాసమునకు నీరజేక్షణతోడ
విడిడియింటినుండి వెడలు శ్రీని
వాసు సాగనంపె బహువిధసత్కార
పూర్వకముగ గగనభూవిభుండు. 13

పెండ్లిదీక్షనుండి వెంకటాచలమెక్క
రాదటంచు దలచి రమణితోడ
బయలుదేరె శ్రీనివాసుండగస్త్యాశ్రి
మమునకు మునిపుణ్యమహిమనెంచి. 14

ఆవనసీమ దివ్యదరహాససముజ్జ్వలసుందరాస్య ప
ద్మావతిగూడి నూతనసమంచితసంతతపంచబాణలీ
లావిలసత్సుఖాంబుధిజలంబుల దేలుచు వేంకటోర్వీబృ
ద్దేవుడు శ్రీనివాసుడు యతీంద్రగృహంబున నుండెవేడుకన్. 15

గగనక్షోణివిభుం డపాయకరరోగగ్రస్తుడాపన్నుడై
వగగంపించుచునున్నవాడనుచు జెప్పన్వచ్చె జారుండుకం
టగతప్రాణుని జూడగాదలచి చింతన్శ్రీనివాసుండు యో
గిగణశ్రేష్ఠునగస్త్యు వెంటగొని యేగెన్ భామినీయుక్తుడై. 16

శ్రీనివాసుని రాకగుర్తించి లేవ
లేకయుంచుకమాట్లాడలేక తొంద
రాను వసుధాము జూపించి మహినివిడిచి
గగనవరపాలకుండు స్వర్గస్థుడాయె. 17

క్షితిపాలకమరణము గని
సుతుడగువసుధాము డధికశోకార్తుండై
ధృతివలనతెలివికలిమిన్
పితృకార్యములన్ బొనర్చె విధ్యుక్తముగన్. 18

ఆజ్ఞనేత్రి పద్మావతి ననునయించి
మరదివసుధామునోదార్చి మరలివెడలె
నాశ్రమమునకు నిజకాంతయనుగమింప
శ్రీనివాసుండు తాపసశ్రేష్ఠతోడ. 19

అన్నగతింపరాజ్యమసకర్షుడు తమ్ము డటంచొకండు రా
జ్యోన్నతికర్షులాత్మభవు లుర్విపతుల్ విగతాసులైనచో
మున్నగనంచు నింకొకడు పోరొనరింపదలంచిరప్రవి
ద్వన్నుతదొంతమానవసుధాములు రాజ్యరమాభిలాషులై. 20

అనినొనరింప నిర్వరుపప్రియత్నములన్ ఘటియించుచుం గెటిం
గినవనజాతనేత్రుడు సఖీమణితో విషయంబుచెప్పియె
వ్వానికి జయంబుగోరుదువొ పల్కుమనన్ జలజాయతాక్షి యి
ట్లనె సకలార్థముల్ తమకుఆత్మగతంబులె ప్రాణనాయకా. 21

అడిగితిరాదరమ్మున మదాశయమున్ వివరించిచెప్పుదున్
బుధులకు యుద్ధరంగమున పోరుచెరుంగదు సోదరుండు మా
పృథివిసగంబు గైకొనియె మున్ పినతండ్రి వరంబుదిల్లి తే
మ్ముదేయుపదాపలో జయముపొందుటయుక్తము ధర్మరక్షకా. 22

మును దుర్యోధనశక్రిజుల్ కమలనాభున్ సాయమర్ధించిన
ట్లు నృపాలానుజపుత్రికల్ విజయశీలున్ శ్రీనివాసున్ రణం
బునసాహాయ్యముచేయగోరిరి మహాత్ముం డబ్రిరాజానుజన్మున
కిచ్చెన్ తనశంఖచక్రము లనిన్ గూడెన్ నృపాలాత్మజున్ 23

భూరిభేరీ శంఖఘోరారవంబులు
దిగిభకర్ణంబులు పగులంగొట్ట
భద్రేభరథవాజిభటపాదఘట్టనల్
పృధివీతలమ్ము కంపింపజేయ
పరశుపట్టిసకుంతబాణఖడ్గముఖాయు
ధప్రయోగములు శాత్రవుల గూల్ప
భీకర సంగ్రామవికలాంగయోధార్త
రావముల్ గుండియల్ ప్రక్కలింప.

ఉగ్రకౌరవపాండవ యుద్ధమట్లు
వీరభీభత్సకరుణముల్ విస్తరింప
దుర్నిరీక్ష్యమై వసుధామతొండమాన
సంగరము భయంకరముగా సంఘటిల్లె. 24

శ్రీనివాసునింగని తొండమానసుతుడు
కోపమున సువర్శనముతో గొట్టినంత
మూర్ఛపడి నేలకొఱగె నంభోజనేత్రి
దతనిజూచి పద్మావతియాత్రపడియె. 25

మునిపుంగవ ప్రోచ్చట
వనిమాధ్వవతియు భవసమహాత్మ్యమునే స్త్వ
స్తుని గావింపుచుసుమ న
వ్వననాక్షివగిందాగుటుమ ప్రార్థించెయుషిన్. 26

ఇరువురి స్త్రీలవారల యా
వరాభిమానములనదగుదానపుతల్లి
నిరుపమసాహసమునసం
గరభూమికేనేగి సంధిగావింపుమిరన్. 27

అని యగస్త్యమహర్షిపల్కిన లతాంగి
సంగరక్షోణికేతెంచె సఖులతోడ
శీతలోపచారమ్ములజేసె మూర్ఛ
దేరి శ్రీనివాసుండు పలింగసుగొని. 28

రమణులు సంగరావనికి రాజనదంచు నెఱుంగవే యిటుల్
కమలదళాక్షి సాహసపుకార్య మొనర్చితి వంచు మించుకో
పమున వచించె యామజనపాలసుతంగని శ్రీనివాసు డా
సుమతియు మౌనమూనె తనచొప్పన శంకజనించియుండుటన్. 29

మునివర నీవేని యీ
వనితగదని చెప్పలేదె పద్మావతితో
నని శ్రీనివాసు డలిగిన
వినయమ్మునమౌనిపలికె ప్రియభాషణముల్. 30

తప్పక తొండమానవసుధాములు సంధి కొనర్చుకోవలెన్
చెప్పక తప్పదిర్వురకు క్షేమముగల్గు విధంబు కానని
యొప్పుల కుప్ప యిప్పటికి నొప్పుగ వచ్చె లతాంగి తోడ నే
జెప్పితి నిట్లు సేయుమని చేయుట యుత్తమటంచెఱింగియున్. 31

అనుముని పల్కులన్ విని మహామహితాత్ముడు శ్రీనివాసు డి
ట్లనియెను తొండమానసుతు నాజి వధించెద రాచపట్టికిన్
మును వచియించినట్లు పితృభూపరిపాలన నొప్పగించెదన్
జనపతి కోర్కె దీర్చెద నచంచలదీక్ష వహించి మించుచున్. 32

అను నాథుని మాటలకున్
వనజాక్షి భయంబు జెంది ప్రాణాధీశ
ననుమన్నించి ఘటింపుడు
పినతండ్రికి ననుజునకును ప్రియముగ సంధిన్. 33

అని వేడ శ్రీనివాసుం
డనుకూలముగాగ మాటలాడి సమముగా
ననుజునకు గుమారునకును
జనపతి రాజ్యంబు పంచి సంధి కుదిర్చెన్. 34

తదుపరి తొండమానవసుధాముల వీడ్కొని శ్రీనివాసుడున్
సుదతియు హానిచంద్రుడును సుందర నిర్మల పర్ణశాల స
మ్ముదమున జేరి రిర్వురికి ముప్పొకయించుక లేనియట్లుగా
కుదిరెను సంధియింక సమకూరు శుభమ్ములటంచు నెంచుచున్. 35

ఆడఁబడుచవు మాయింటి కమ్మనీవు
రాజ్యషోడశాంశము గొమ్ము రాజపుత్రి
అనుచుపద్మావతి కొసంగి రాదరమున
ముప్పదారుగ్రామమ్ము లాభూమిపతులు. 36

ఆదరమ్మునబిలిచి విం దారగింపు
డనుచుప్రార్థింపరాజగేహమ్ములందు
నిష్టమృష్టాన్నసంతృప్తహృదయులయిరి
శ్రీనివాసపద్మావతుల్ మౌనితోడ. 37

మునివరునాశ్రమమ్మునను ముద్దియతోనివశించుచున్నప
ద్మనయనుశ్రీనివాసుని సమంచితభక్తివశాంతరంగుడై
కనుగొనదొండమాననృపకాంతు డొకానొకనాడువచ్చె నా
తనిగనికౌగిలించుకొనెదానవశాత్రవుడాదరమ్ముగన్. 38

యిరువురికుశలప్రశ్నలు
జరిగినతరువాత రాజచంద్రా నా కీ
వెఱిగింపుము నీ అభిమత
మరమరలేకుండననుచుహరిప్రశ్నించెన్. 39

ఆగమమ్ములుసోమకుం డపహరించి
నాగలోకమ్మునందునడాగియుండ
దానవునిజంపి వేదముల్ ధరణిసురుల
కప్పగించినభూరిమత్స్యంబ వీవ. 40

అమరులసురులు పాలసంద్రమ్ము మథింప
నెపలమందరం బడుగంటి యెగయకున్న
దానిఅడుగున జేరి సుధ నొదవించి
మహిమజూపినఆదికూర్మంబ వీవ. 41

మునుహిరణ్యాక్షనామకదనుజు డవని
జుట్టగాజుట్టికట్టడిపెట్టుచుండ
రాక్షసునిజంపి ధారుణీరక్షణమ్ము
నాచరించినతొలివరాహంబ వీవ. 42

దినదినము హిరణ్యకశిపదనుజవిభుడు
కొమరు శిక్షించుచుండ స్తంభమునబుట్టి
అసురనాయకు జంపి ప్రహ్లాదుగాచి
మహిమజూపించిననరసింహంబ వీవ. 43

త్రిపదభూదానముగ్రహించిపృథివినొక్క
పాదమున వ్యోమము మరొక్కపాదమునను
గొలిచిమూడవపాదమ్ము తలనిడి బలి
దనుజనాధు నడచినవామనుడ వీవ. 44

సజ్జనుల కపకారముల్ సలుపుచున్న
కార్తవీర్యార్జునాదిక క్ష్మాపతులను
జంపి క్షత్రియవంశసంజాతగర్వ
మడచివేసినపరశురాముడవు వీవ. 45

అవనిజాత మోసమ్మున నపహరించి
పొందునాసించురావణు ఘోర జంపి
శిఖిపరీక్ష నుత్తీర్ణతజెందియున్న
పడతి నేలినరామచంద్రుడవు నీవ. 46

హలముధరియించి సింహశౌర్యమువహించి
అసురసంహార మొనరించునవసరమున
తమ్మునకు తోడుగా నాహనమ్ము జేసి
పొడిమిని జూపినబలరాముడవు నీవ. 47

పూతనను జంపి మధుకైటభులవధించి
కంసుద్రుంచి రక్కసుల పెక్కండ్రి దునిమి
శిష్టరక్షణమ్మునుదుష్టశిక్షణమ్ము
పూనిచేసినశ్రీకృష్ణమూర్తి వీవ. 48

వ్యసనలోలురై పురుషులుపొడిదొఱగి
సంచరించుచునుండనబ్జదళనేత్రి
లమలశీలమ్ముగోల్పోయి యడరుచుండ
క్షమను రక్షింప ప్రభవించుకల్కి వీవ. 49

తావకదర్శనభాగ్యము
కైవల్యపదంబు గూర్చు కంజాతాక్ష
కావుననిన్నున్ జూడగ
నేవచ్చితి దేవదేవ నిర్మలభావ 50

పదునాలుగుభువనంబుల
నాదవింతువు బెంతువు లయ మొనరింతు
వశేష దయాంబుధి పరమపురుష
సదమలవేదస్వరూపా సజ్జనవినుతా. 51

ఆదిమధ్యాంతరహితుండ వప్రమేయు
డవునిగమ వేద్యుడ వనంతుడవని మునులు
మానవశ్రేష్ఠు లమరులు జ్ఞానభక్తి
యుక్తులై నిన్ను బొగడి ధన్యులగుచుందు్రు. 52

బహువిధపూర్వపుణ్యపరిపాకము గల్గుటచేలభించె మా
కిహపరసాధనంబయిన యీభవదాప్తత పుత్రికాకర
గ్రహణపువేళనిన్గొలిచిగాంచితి ధన్యత నిప్పుడింకభూ
వహనముమానినిన్గొలువవచ్చితిమోక్షమునొందు వేడుకన్. 53

అనియనుతొండమానునిసదాశయమున్విని శ్రీనివాసు డి
ట్లనియెనుసంతసమ్మునధరాధిపతీ భవదగ్రజాతు డం
ఘ్రినలినయుగ్మమున్ గడిగి ప్రీతిగ గన్నియ నీకునిచ్చి సం
జనితవిశేషపుణ్యమున శాశ్వతకీర్తి గడించెధన్యుడై. 54

ఉన్నతరాజసౌధమున నొప్పుగనుండినరాజపుత్రి యీ
నన్నువివాహమాడె మునినాయకునాశ్రమ మందునున్న దీ
చిన్నతనంబు బోవుటకు చిత్రముగా నొకదేవగేహ మ
త్యున్నతి సంఘటింపుమిక నుర్వితలాధిప వెంకటాద్రిపై. 55

అనిపలుకుశ్రీనివాసుని
పనుపునువిని సంతసమున వసుధాపతి యి
ట్లనియె మహాత్మా ఎవ్విధ
మున నెచ్చట గట్టవలయుభూరిగృహంబున్. 56

నరపతియడిగినఅంశము
సరిగావివరింపగోరి జనపతితోడన్
సరసిజలోచనతోజని
యరవిందాక్షుండు వెంకటాచలమెక్కెన్. 57

వారి వరాహస్వామి స
గౌరవముగ నాదరించె కమలాక్షుండున్
భూరమణునకు జూపెను
భూరితరవరాహదత్తపుణ్యస్థలమున్. 58

ప్రాఙ్ముఖముగ నొప్పెడునట్లు స్వామిపుష్క-
రిణికి దక్షిణమున ధేనుగృహము ధాన్య
శాల భూషణశాల భోజనగృహంబు
యజ్ఞమండపాదులతోడనలరునట్లు. 59

ప్రాకటసప్తద్వార
ప్రాకారత్రితయగోపురద్వయఘటితం
బై కాంచనతోరణశో
భాకరమగునట్లు గట్టవలయు భవనమున్. 60

పూర్వజన్మంబునందు నపూర్వమైన
పూలబావి త్రవ్వించిన పుణ్యమూర్తి
విపుడు దేవాలయంబు గట్టించు టుత్తమం
బగు నీకు నో తొండమాన నృపతి 61

శ్రీనివాసుని వచనముల్ వీనుగవకు
పండువొనరింప తొండమానుండు పలికె
నేను పూర్వజన్మజ్ఞానహీనమతిని
పుష్పకూపచరిత్రి చెప్పుము మహాత్మ! 62

హరిచరణ పద్మ సేవా
నిరతుడు వైఖానసుండు నిశ్చలభక్తిన్
కరివరదపురాణము విని
అరుదెంచుచునుండె నిజగృహాభిముఖుండై. 63

శ్రీమత్ భాగవతకథా
సామర్థ్యమతడు పొగడుచుచనిచని కృష్ణ
స్వామిస్వరూపదర్శన
కామితమతియై తలంచె కంజదళాక్షున్. 64

తలచి ఒకచోటగూర్చుండి తపముచేసె
తనిసి నారాయణుండు ప్రత్యక్షమాయె
తలచినట్లు కృష్ణస్వామిదర్శనంబు
గలుగజేతని చింతింపవలదు వినుము. 65

భక్తశేఖరా నీవింక స్వామిపుష్క-
రిణికి దక్షిణంబందు తింత్రిణికక్రింద
పుట్టలోనున్న దేవదేవుని గొలువుము
దారిలోనిగ్గలియు రంగదాసుతోడ. 66

అని యాదేశమొసంగి యచ్యుతు దదృశ్యుండాయె వైఖానస సుం
దనిమేషస్థితినుండితెప్పరిలి విష్ణ్వాజ్ఞానుసారంబుగా
జనె మోదంబున మార్గమధ్యమున సంచారంబుగావించు చుం
డినభక్తాగ్రణి రంగదాసు కలిసెన్ స్నేహంబు పాటించుచున్. 67

స్వామిపుష్కరిణీతీరభూమిజమ్ము
క్రిందనున్న వల్మీకమ్ము నందునున్న
శ్రీనివాసుని జూచిఅర్చింపదొడగె
గాఢభక్తియుక్తుండువైఖానసుండు. 68

హరిపూజన్ బొనరించుభక్తునకు సాహాయ్యంబు గావింప గ్రొ
వ్విరులన్ దెచ్చుచు రంగదాసు తనలో వెంపారుసద్భక్తితో
వరలించెన్ బువుదోట నీటికై కూపంబొండుత్రవ్వించె నె
ల్లరు దానింగనిపూలబావియని పిల్వంజొచ్చి రద్ధిపప్రజల్. 69

రంగురంగులపూవుం రంగదాసు
తెచ్చియిచ్చుచునుండ భక్తిప్రసన్న
హృదయు డగుచుదీక్షవహించి కృష్ణగాత్రు
శ్రీనివాసు బూజించు వైఖానసుండు.

70

రంగదా సొక్కదినమున బ్రసవములను
దెచ్చుటకు నేగుదెంచిపత్నీసమేతు
డై యనంగపీడితచిత్తు డగుచుస్వామి
పుష్కరిణి జలక్రీడల బ్రొద్దుగడపె. 71

తెలివిగలిగి భక్తునకు నందించె విరులు
దాన మిగుల గోపించె వైఖానసుండు
రంగదాసు దైవతకార్యభంగ మెంచి
యెంచి యధికపశ్చాత్తప్త హృదయుడాయె. 72

తనదగుబుద్ధిమాంద్యమున దప్పొనరించినరంగదాసు దా
నినిదలపోసి చింతిలుచు నీరజపత్రవిలోచనున్ మనం
బునస్మరియించె పూర్వభవపుణ్యవిశేషముచే నుపేంద్రు డా
తనియెదుటన్ గనంబడి ముదావహభాషల వానితోననెన్. 73

స్వామిపుష్కరిణీతీరభూమియందు
దేహమును బాసి జన్మింతు తిరిగినీవు
చంద్రవంశమున సుధర్మజనవిభునకు
పుత్రకుండవై చింతింపబోకు మనుచు. 74

రంగదాసవు నీవె పూర్వభవమందు
పూలబావిని త్రవ్వించి మేలొనర్చి
తింక దేవాలయమ్ము గట్టింపుమిపుడు
నేను పద్మావతిన్ గూడి దాన నుందు. 75

మోక్షశ్రీసంధాతా!
రాక్షససంహరణనిపుణరణసప్రీతా!
రక్షితసురసంఘాతా!
అక్షయవరదాత! వేంకటాచలనేతా! 74

ఇది శ్రీ మదాంగీరస బార్హస్పత్య భారద్వాజస
త్రియార్షేయప్రవారాన్విత భారద్వాజస గోత్ర
ఆపస్తంబసూత్రయజుశ్శాఖాధ్యాయి బాపనాంబా
కామేశ్వర శర్మ పుత్రి బంగారేశ్వర శర్మ ప్రణీతంబైన
ఉత్తర శ్రీనివాసము నందు ప్రథమాశ్వాసముసంపూర్ణము. 75



# ఉత్తర శ్రీనివాసము
## ప్రథమ భాగము
### ద్వితీయాశ్వాసము

శ్రీమత్ త్రిజగద్రక్షక!
కామిత ఫలసిద్ధిదాయకా! ఆకాశ
స్వామితనూజానాయక!
భూమీసురవర్యవినుతపుణ్యశ్లోకా! 1

ద్వారగోపురప్రాకారభాసురముగ
మండపధ్వజస్తంభసమంచితముగ
తొండమానుండు గట్టించె తోయజాక్ష
వాసయోగ్యపవిత్ర దేవాలయమ్ము. 2

క్రమబద్ధంబుగ మీరుచెప్పినయటుల్ గట్టించితిన్ దేవ గే
హము నన్నున్గరుణించి సర్వవిధయోగ్యంబైనకాలంబునన్
బ్రముదంబొప్ప గృహప్రవేశము నొనర్పన్ రండురండంచు బ
ల్కె మహీనాధుడు శ్రీనివాసుగని భక్తిప్రీతచేతస్కుడై. 3

చతురాస్యశంకర శక్రాదికసుపర్వు
లిరుకెలంకుల బరాబరులునెఱప
వేదపండితులైనద్విజవంశసంజాతు
లాగమస్వరముల నాలపింప

నారదతుంబురుల్ నలినాక్షకీర్తనల్
పాడుచు శ్రవణోత్సవము ఘటింప
రంభాదిదేవతారమణీమనోజ్ఞ న
ర్తనభంగి నేత్రపర్వమొనర్ప

దేవదుందుభిస్వరముల్ ప్రతిధ్వనింప
చిరునగవులపద్మావతీశ్రీనివాసు
లాలయద్వారములుదాటి యమలగర్భ
గృహము జొచ్చిరి నృపతి సంతృప్తిపరుప. 4

దక్షణకరమ్ము పాదపద్మముల జూప
వామహస్తమ్ము కటిపైనవ్రాలియుండ
శ్రీనివాసుడుండెను భక్తబృందములను
గరుణ రక్షింపగ నడుముగట్టినట్లు. 5

అలఘతరభక్తిదన్నున్
గొలిచెడువారికి భవాబ్ధి కువలయమందున్
మొలలోతున నుండెడునని
తెలిపెడుచందంబుగా నుతించిరివిబుధుల్. 6

దానినానందమయుడయినశ్రీనివాసు
డెలమినుండుట నానందనిలయమనిరి
వేంకటేశ్వరసత్కృపాపీఠమనిరి
నిత్యకళ్యాణయోగ్యమైనెగడుననిరి. 7

నిర్ఝరాలయ మందున నిలిచియున్న
వరదుడగు వేంకటేశ్వరస్వామివద్ద
రెండుజ్యోతులు వెలిగించి శ్రీనివాసు
నెలమిగాంచి పద్మభవుండుపలికెనిట్లు. 8

జ్యోతులీరెండు మార్తాండసోము లట్లు
కలియుగాంత పర్యంతమ్ము వెలుగుగాక
భక్తవరదుండ వగుచు నీభవన మందు
నిలిచియుందువుగాక కలియుగమున. 9

భవదభీష్టమ్ము ఫలియించు పద్మసంభ
వా ధ్వజారోహణాద్యుత్సవమ్ము లింక
నిర్వహించి మోదమ్ము సంధింపు మనియె
శ్రీనివాసుండు సంతృప్తహృదయు డగుచు. 10

స్వామివారికి బ్రహ్మోత్సవమ్ము నిర్వ
హించుటకు గజాశ్వరథాద్యనేకవాహ
నములు సిద్ధమ్ముగావించి నలిననేత్రా
భక్తవరుల నాహ్వానింపవలయు ననుచు. 11

ప్రేక్షకాక్షిపర్వంబుగా వేంకటేశ్వ
రునకు బ్రహ్మోత్సవమ్ము నర్త మనియెంచి
తొండమానభూమీతలాఖండలు బిలి
పించి యాశీర్వదించి వచించె బ్రహ్మ. 12

కాంచనగర్భుడాదినపరికారము సర్వము నిర్వహింపగా
నెంచి వసుంధరాతలమహేంద్రుడు వెంటనె విశ్వకర్మ రా
వించి ప్రియోక్తులన్ దనయభీష్టము దెల్పిన శిల్పివిష్ణుభ
క్త్యంచితచిత్తుడై నృపతి గన్గొని యట్లయొనర్తు నంచనెన్. 13

గరుడరథాదులన్ బహుముఖప్రతిభన్ ఘటియించి కాంచనా
భరణములన్ బొనర్చి నరపాలున కిచ్చెను విశ్వకర్మ సం
బరమున బొంగి భూవిభుడు వానిని మిక్కిలిసత్కరించె న
బ్బురముగ జూచి రెల్లరు విభూషణవాహనవస్తుసంపదల్. 14

అంగవంగకళింగమత్స్యకురుపాండ్య
పౌండ్రజాంగలచేదిబర్బరవిరాట
సింధుముఖదేశముల భక్తశేఖరులకు
బంపె తొండమానవిభుడాహ్వానములను. 15

స్వామివారిబ్రహ్మోత్సవసమయమందు
నక్షిపర్వమ్ముచేయుకార్యక్రమమ్ము
గాంచుటకు భక్తపరులు పెక్కండ్రువచ్చి
రఖిలదేశవాసులు వేంకటాద్రిగుడికి. 16

పనులెల్ల పూర్తియయినవి
వనజాక్ష! నీ విక నరవాహనముపయిన్
ఆనిలయాలయప్రదక్షిణ
మొనరుపు మని హరినిపంకజోద్భవు డడిగెన్. 17

పంకజగర్భ! నీ విపుడుపల్కినయట్లొనరించు టొప్ప దా
తంకము చెప్పినట్టు తెడదన్ దలపోయకు దీక్షతోడ ని
శ్శంక ఘటింపజేయుమిక చక్కనిమూర్తుల నాలుగింటి న
ల్వంకలవారు మెత్తురనిపంకజనాభుడు పల్కె బ్రహ్మతో. 18

సకలద్విజమానసరం
జకమ్ముగా సత్వరోగ్రిసర్వాధిపతే
ఖకనామకమూర్తుల వి
శ్వకర్మ సంసిద్ధపరిచె పద్మజువాజ్ఞన్. 19

జలజాక్షకార్యదీక్షా
విలసన్మతి పద్మజుండు విష్వక్సేనా
దులతో ప్రప్రథమముగ
న్మలపై నొకకొంతమేర నడచుచు జనియెన్. 20

ఒకపుట్టవద్దకున్ జని
ప్రకటస్వరయుక్తమంత్రపఠనము ధ్వజనా
యకు లొనరించుచునుండగ
నకలంకపుబుట్టమట్టి యట త్రవ్వించెన్. 21

మదగజంబుపై నాపుట్టమట్టి నుంచి
యాలయమ్మున కేతెంచి యంకురార్ప
ణమ్ము చేసె ధ్వజారోహణమున కజుడు
క్ష్మాసురులు వేదమంత్రముల్ చదువుచుండ. 22

మరునాడు ధ్వజారోహణ
జరిగె తిరుమలేసు భక్తజను లూరేగిం
చి రుదయమున పల్లకీపై
పరితృప్తిగ రాత్రి శేషవాహనముపయిన్. 23

వరుసగ ద్వితీయదినమున పగలురేయి
శేషహంసవాహనుజేసి శ్రీనివాసు
వైభవముగ నూరేగించి రాభరణ వి
భూషితు నొనర్చి పద్మగర్భునిపనుపున 24

తిరుపతిదేవదేవుని తృతీయదినంబున సింహవాహనో
పరివెలయించియుత్సవ మపార ముదంబుజనింప నిర్వహిం
చి రుదయమందు; రాత్రి యతిశేఖరపూజితు శ్రీనివాసు సం
బరమున ముంచిముత్తియపుబందిరిక్రింద భజంచి రింపుగన్. 25

శ్రీనివాసు నూరేగించిరి మరునాటి
యుదయమున కల్పవృక్షవాహనముమీద
రాత్రి యుత్తుంగభద్రవారణముమీద
క్ష్మాసురులు వేదమంత్రముల్ చదువుచుండ. 26

పంచమదినోదయంబున భక్తితోడ
పల్లకీమీద నారాత్రి వైభవముగా
మోహినీరూపమున పక్షిముఖ్యవాహ
నంబుమీద నూరేగించిరంబుజాక్షు. 27

ఘనముగ నూరేగించిరి
హనుమద్వాహనముమీద నావవయుదయం
బున శ్రీనివాసు జయజయ
నినదంబులతోడ భక్తివిశ్వంహృదయుల్. 28

నాటిసాయంత్రమున వసంతమంటపం
బున మంగళగిరివాహనముమీద
పద్మావతీశ్రీనివాసులన్ జేర్చి వ
సంతోత్సవమ్మును జరిపి రాత్రి
గజవాహనముమీద గడువైభవముగ నూ
రేగించి రాసక్తహృదయు లగుచు
పద్మాక్షు సూర్యప్రభావాహనముమీద
నుంచి యేడవనాటి యుదయ మందు

జరిపి రతివినోదముగ నుత్సవము పిదప
మంగళగిరివాహనముమీద నంగనాన
హితముగా పూవుదోటకు నేగుదెంచి
స్వామి విహరించె సాయంత్రసమయమందు. 29

స్వామివారి చంద్రప్రభావాహనమ్ము
మీద రాత్రియూరేగించి రాదినమున
నెనిమిదవనా డుషఃకాలమున రథోత్స
వము మహానంద సంధాయకముగ జరిగె. 30

ఎనిమిదవరాత్రి అశ్వవాహనముమీఁద
స్వామివారికి బ్రహ్మోత్సవమ్ము జరిగె
తొమ్మిదవనాటియుదయకాలమ్మునందు
స్వామిపుష్కరిణికి శ్రీనివాసమూర్తి 31

పల్లకీమీఁద నూరేగివచ్చిమంగ
ళగిరివాహనారూఢుఁడైదిగి జలకము
లాడె భక్తబృందమ్ములు హర్ష మొంద
స్తోత్రపఠనముల్ గావించి చూచుచుండ. 32

పిమ్మటమహాధ్వజారోహణమ్ముజరిగె
దశమదినమునభక్తబృందములు వేడ్క
శ్రీకరమగుపద్మావతీశ్రీనివాస
పుష్పయాగమ్ము జరిపి రపూర్వభంగి. 33

అమితమనోజ్ఞవాహనసమంచితమూర్తిని శ్రీనివాసునిన్
క్రమముగ జూచిచూచి తమకార్యములన్ వివరించిధన్యులై
కమలజదేవనాయకముఖ్యత్రిదశప్రవరుల్ సురేంద్రులో
కమునకునేగుదెంచిరి అఖండవికాసలసన్ముఖాబ్జులై. 34

నానాదేశసమాగతావనిపబృందమ్ముల్ మహానందసం
ధానంబైనమహోత్సవక్రమము నేత్రద్వంద్వపర్వంబుగా
గానంగల్గి ప్రసాదముల్ గొని నిజస్థానాగముల్ చేరి రా
స్థానప్రాకటసభ్యులెల్లరును సందర్శించి శ్లాఘింపగన్. 35

కార్యనిర్వహణంబున కమలజునకు
తోడుపడి శ్రీనివాసునిదురితహరుని
భక్తితోడపూజించితృప్తమతులైన
మునులును దమదమ నివాసములకు జనిరి. 36

అతులితభక్తిపూర్ణహృదయాంబురుహుండగుతొండమాను దం
చితదృఢదీక్షతోపనులుచేసిక్రమంపడి వేంకటోర్వీభృ
త్పతికలవున్ గ్రహించి పరివారముతోజని ఏలుచుండెను
న్నతసుఖశాంతిసౌఖ్యము లనంతముగా దనరారురాజ్యమున్. 37

ఒకదినమందు విప్రవరుడొక్కడుకొల్వునకేగుదెంచి త
నికి బ్రణమిల్లగా నృపతి నీరజసంభవవంశరత్ననా
యకు గని యాదరంబువినయంబుగడల్కొన బల్కరించి వా
ని కొసగెనర్ఘ్యపాద్యముల నిర్మలధర్మవిధానచాతురిన్. 38

ఓవిప్రాన్వయచంద్రా
తావకవాంఛనుదెలుపుము తప్పకదానిన్
గావింతు శ్రద్ధగా నని
భూవిభుడు వచించిన విని భూసురు డనియెన్. 39

నను కూర్మం డందురు మ
ద్వనితానామంబు లక్ష్మి ధరణీపాలా
తనయుని రాఘవు డందురు 40
వినుమయ్య మదీయవాంఛ వివరింతు నికన్.

ఈకార్తికంబున గం
గాకూలంకషజలమున కలుషగవలయున్
మాకూర్మితండ్రియస్థుల
గ్రక్కొనవేవెడలవలయు కాశీపురికిన్. 41

భార్యాపుత్రుల వెంటబెట్టుకొని పోవంగాల నే కాశికిన్
కార్యంబున్విరమింపజెల్లను భవత్కారుణ్య మాసించెదే
ధైర్యంబూని సతిన్కుమారు తమవెంటన్వీసియేతెంతు నొ
దార్యంబొప్ప మదీయవాంఛితము సంధానింపుమోభూవరా. 42

గర్భవతి నాసతి కుమారు డర్భకుండు
వారి నాదరమొప్ప గాపాడు మేను
వారణాశినుండి తిరిగివచ్చుదాక
సుఖము లభియించు నీకు నోక్షోణినాథ. 43

వారణాశికి నేతెంచివచ్చుటకు స
రిపడునంతసొమ్ము ద్విజవరేణ్యునకు నొ
సగి యతనిసతిని సుతుని సముచితమగు
గృహమునందున నుంచె ధాత్రివిభుండు. 44

ఆరునెలల్ కుమారునకునమ్మకుతింటకుఁబాలునట్టు లా
హారపదార్థముల్ గృహమునందున నుంచె నృపాలకుండు త
ద్వారిజనేత్రియున్ సుతుడుభద్రముగా నివసించి రాపయిన్
వారల విస్మరించెజనపాలుడు కార్యవశాంతరంగుడై. 45

గర్భవతియామె పుత్త్రికం దర్భకుండు
గాన నాహారములభించు కరణి లేక
ఆకటికి దట్టుకొనలేక శోకవివశు
లగుచు కృశియించిమరణించి రయ్యిరువురు. 46

ఒరులు మరణవార్త నెఱుగమి దేహముల్
దహనపఱుపబడక ధరణి నుంట
అస్థిపంజరమ్ములయిపోయి వ్యక్తులం
గురుతుపట్టలేనికరణి నుండె. 47

నరవరచంద్రుడిచ్చినధనమ్మును గైకొని వాని మెచ్చుచున్
ద్వరపడకుండ చిత్తమున ధైర్యము బూని పవిత్త్రకాశికా
పురమున కల్గనన్ వెడలిపుణ్యనదీజలమందు నస్థులన్
ధరణిసురుండు ముంచి పితృతర్పణముల్ పొనరించె శ్రద్ధగన్. 48

ఆచటిదేవాలయమ్ముల కరుగుదెంచి
అన్నపూర్ణను విశ్వేశ్వరు న్నుతించి
కాశికా విశాలాక్షిని గాంచి యంజ
లించి తననగరికి బయల్దేఱె ద్విజుడు. 49

రయమున బ్రయాణమునొనర్చి బ్రాహ్మణుండు
సతిని బుత్రుని జూచునాసక్తి తోడ
నిజపురమ్మున కరుదెంచి నృపతి జూచి
ఆలుబిడ్డలం దిరిగి యెమ్మంచు నడిగె. 50

మరచిపోయినవిషయమున్ మనుజపతికి
జ్ఞాపకముచేసె విప్రవిజ్ఞాపనమ్ము
ద్విజుని గూర్చుండబెట్టి ధాత్రీవిభుండు
వారి దోడ్కొనిరమ్మని భటునిపంపె. 51

క్షితిసురభామినీవసతిగేహము జొచ్చితదీయభాగముల్
వెతికి ధరాతలంబుపయి విప్రసతీతనయాస్థిసంచయ
స్థితి గని దుఃఖసంభరితచిత్తముతోడ భటుండువచ్చివే
కతమున రాజుతో నుడివె క్ష్మాసురవర్యకుటుంబదుస్థితిన్. 52

అమిత విషాదపూర్ణహృదయంబున భూపతి ధర్మకార్యభం
గమునకు చాలదుఃఖపడి క్ష్మాసురశేఖరు డాగ్రహించిశా
ప మొసగునంచు భీపడి విపద్దశ బొంకుట తప్పుగా దటం
చు మది దలంచి యిట్లనియె క్షోణిసురాగ్రణితోడ మెల్లగన్. 53

శ్రీనివాసునకు పయోభిషేకము నొన
రింప నంతఃపురాంగన లేగుచుండ
వారివెంట నీభార్య కుమారుతోడ
వేంకటాద్రికి నేతెంచె విప్రవర్య. 54

ఒకటిలేక రెండుదినంబులకు నిరువురు
తిరిగివత్తురు మీరంతవఱకు నిచట
నందుకొని భోజనము చేయుచుండుడయ్య
ఆతపడుటకు హేతు వావంతలేదు. 55

క్ష్మాసురేశ్వరమణిహారసామణిని సముని
తముగా నాదరింపు మనుచు తననరిపుల
కొజ్జు లొసగి పుత్రునితో నరుగుదెంచె
తొండమానుండు తిరుపతికొండపైకి. 56

అనిలశక్తియుక్తమగునద్ధరణీపతి శ్రీనివాసు ద
ర్శించి నతాననుం డగుచుచేతులుమోడ్చి నిలంబడంగ వీ
క్షించి వృషాద్రినాయకుడు క్షేమమె మీకని పల్కరించి పృ
చ్ఛించె త్వదీయవాంఛితము చెప్పుమునాకని సాదరంబుగన్. 57

తన ఘోరపాపకార్యము
వినిపించుటకున్ దలంకి పృథివీపతి వం
చినతల నెత్తక మౌన
మ్మున నిలబడె శ్రీనివాసమూర్తికి నెదుటన్. 58

ధరణీసురకాంతాసుత
మరణమ్ములతెఱ గెఱింగి మనుజేంద్రునివి
స్మరణము సహజంబగుటన్
సరసిజనేత్రుడు పలికె ప్రసన్నముఖుండై. 59

మానవభక్తవర్యుడవు మానుషవిస్మృతి కారణంబుగా
భూమిసురాంగనామణియుపుత్రుడున్మరణించి రేను ని
న్నేమని మందలింపగల నింకనఘం బరగింపజేసెదన్
భూపతి తదస్థికలు ముందుగ దెమ్మని పంపు మాత్మజున్. 60

శ్రీనివాస పదాంచిత్రితహృదయుడగుచు
వైర్యమున దన్ను దాని మహీతలవిభుండు
తనయునంపె భూదేవకాంతాతనయుల
యస్థికలు సత్వరముగ దెమ్మనుచు బలికి. 61

నృపతనూజుండు నూతనగృహము జొచ్చి
యందుగలయస్థికలనెల్ల నొందుపఱచి
దెచ్చి యామూట వేంకటాద్రిపతి కిచ్చె
మృతుల జీవింపజేయు స్వామియనుకొనుచు. 62

నరపతిపుత్రకుం దొసగిననగానియుండినమూట స్వామిపు
ష్కరిణికి తూర్పునంగల పవిత్రజలప్రవహించుతీర్థపుం
దరిగలశాలిపై నిలిపి తానముచేసిజలంబు దోసిటం
వనుసగ దోసె శేషగిరినాయకు దస్థులపైన సత్కృపన్. 63

కాంచనగర్భవంశకులకాంతయుభూసురపుత్రికుండు జీ
వించిరి యత్క్షణంపదుమ వేడుకమీరగ కన్నులార వీ
క్షించినతొంటిమానుదిరుచేతులు మోడ్చి నమస్కరించి కీ
ర్తించె మహాత్ము వేంకటగిరిప్రభువర్యుని శ్రీనివాసునిన్. 64

మృతవిప్రసతీసుతులను
బ్రతికించి నృపాలుడైనభక్తవరునివాం
ఛితమును దీర్చెను వేంకట
పతియందరు మౌనమేను వహియింతునికన్. 65

అనినుడివె శ్రీనివాసుడు
విని విప్రసతీసుతులను వెంటగొని త్వరన్
జని యొప్పగించె ద్విజునకు
జనపతి దీవించె నధిపు జ్ఞానగురుడు కడున్. 66

అనలినాక్షుగర్భమున సత్యధిరాద్భుతభంగి జూచితిన్
మానవదేవనాగభువనంబులవారల నెల్లరన్ మహా
మౌనుల భక్తులన్ సకలమానవనాథుల సర్వశాస్త్రవి
జ్ఞానుల సాధుసజ్జనుల సత్కవివర్యుల ప్రాణనాయకా. 67

అని కాంత నుడివె తనయుం
డనియెను ప్రమథగణనాథుడగుపరమశివుం
గనుగొంటిననుచు విప్రుం
డనుంగుటాలిం గుమారు నభినందించెన్. 68

అజ్ఞానతిమిరనాశక!
యజ్ఞాదిపవిత్రవేంకటావనివృత్స
ర్వజ్ఞానా! భక్తాగ్రణి
విజ్ఞానవిధానదృశ్యవిశ్రుతమూర్తీ! 69

ఇదిశ్రీమదాంగిరసబార్హస్పత్యభారద్వాజస
త్రియార్షేయప్రవరాన్వితభారద్వాజసగోత్ర
ఆపస్తంబసూత్రయజుశ్శాఖాధ్యాయిబాపనాంబా
కామేశ్వరశర్మపుత్ర బంగారేశ్వరశర్మప్రణీతంబైన
ఉత్తరశ్రీనివాసమునందు ద్వితీయాశ్వాసము సంపూర్ణము. 70

# ఉత్తర శ్రీనివాసము

## ప్రథమ భాగము

### తృతీయాశ్వాసము

శ్రీవేంకటగిరినాథా!
భావజజనకా! ప్రసిద్ధపావనచరితా!
గోవిందా! దనుజాంతక!
శ్రీవనితాచిత్తచోర! శ్రితజనపోష! 1

శ్రీనివాసుండు మౌనమ్ము పూనియుంట
గాంచమానుండు మిక్కిలి దుఃఖపడుచు
శ్రీనివాసుం బ్రసన్నుని జేయునట్టి
తెఱగు నెరిగింపు డని మౌనివరులనడిగె. 2

శ్రీనివాసునకున్ దులసీదళముల
తో సహస్రనామార్చనం జేసి తత్ప్ర
సాదముగ్రహింపు మతడు ప్రసన్నుడగును
గాంచమానవసుంధరామండలేశ. 3

అని అంగిరసముని ప
ల్కిన విని కడు శ్రద్ధతోడ క్షితిపతి గావిం
చెను నవతులసీపత్రా
ర్చనముం భక్తిప్రపన్నాంతరంగుం డగుచున్. 4

కానిమహానుభావుడగు కంజదళాక్షుడు పల్కకుండె భూ
జాని నమస్కరించి యనె సంతతమున్ నినుభక్తిగొల్చుచున్
బూసిక నిన్ను నమ్మినన్నృపుండను నేభవదీయభక్తుడన్
గానకృపాకటాక్షసుముఖమ్ముగ బల్కుము వేంకటేశ్వరా. 5

అనుతొండమానువిజ్ఞా
పనమును విని గగనవాణి పలికిన భంగిన్
వినిపించె శ్రీనివాసుడు
తనమౌనపు కారణమ్ము ధరణీపతికిన్. 6

భూసురవనితాతనయుల
గాసింబెట్టి మరణింపగాజేసిన నీ
దోసము సహింపరానిది
ఆశింపకు శ్రీనివాసునాదర మింకన్. 7

నారంటె నధికభక్తుడు
నీకెవ్వడు శ్రీనివాస నీయాదరమున్
గైకొందునని భజించిన
నా కాశాభంగమాయె నగుబాటాయెన్. 8

అనుతొండమానుపలుకులు
విని వేంకటరమణు డనియె విను ముత్తరమం
దున నొకపల్లియ భీముం
డనుభక్తుడు గలడు వాని నరయుము రాజా. 9

వేంకటేశు మెప్పించిన భీమనాయ
కానుపమభక్తశేఖరున్ గనుగొనంగ
తొండమానుండు తిరుపతికొండ డిగ్గి
వెడలె ఉత్తరాభిముఖుడై వేడ్క-పసుచు. 10

ధ్యానతపోజపాదికసమర్థత భీముడు నన్ను మించునో
జ్ఞానవిశిష్టయోగఫలసంపద నాతడు నన్ను మించునో
మానవధర్మనిర్వహణమార్గమునందున నన్ను మించునో
నే నరుదెంచి చూచిగమనించెద భీమునిభక్తిసారమున్. 11

అనుకొనుచు భీమునిగృహం
బు నడిగి తెలిసికొని భూమిపతి గ్ర
క్కున జేరి మూర్ఛపడియెను
వనరుహదళనేత్రభక్తిపరవశు డగుచున్. 12

లోపలినుండివచ్చి తనలోగిలిముంగిట మూర్ఛవడ్డధా
త్రీపతి జూచిజాలిపడి తిర్పతిశైలపతిందలంచి వి
జ్ఞాపనమున్ బొనర్చె నృపచంద్రుని గావుమటంచు భీము డు
ద్దీపితభక్తిసంజనితతేజము వెల్వడసంస్తుతించుచున్. 13

తనభక్తుండగుభీముడు
జనపతియగుతొండమాను సంరక్షింపన్
వినుతించె శ్రీనివాసుని
విని హరి సాక్షాత్కరించె భీమునియెదుటన్ 14

మత్స్యకూర్మ వరాహవామననృశింహ
పరశరామకృష్ణబలరామరఘురామ
కల్కిబుద్ధావతారముల్ గలుగజేసి
క్షోణిరక్షించు శ్రీనివాసుండ వీవు. 15

భక్తులెల్లరు తమతమశక్తికొలది
విలువగలదొడ్డకానుకలర్పింతురినీకు
దేని నర్పింపగలవాడ శ్రీనివాస
విందు గైకొందు మాయింటియందునేడు. 16

అని భీముండు పలుకగా
విని వేంకటపతి వచించె పృథ్వీపతి చే
సిన ఘోరపాపకార్యము
తనకున్ క్షమియింపరానితప్పిద మనుచున్. 17

భీముడు భక్తియుక్తమతి వేడ్కజనింపగ వేంకటేశ్వరున్
భామినితోడ విందునకు వచ్చి భుజింపుడంచు బల్కగా
శ్రీసతితోడ భోజనముచేసెను తృప్తిగ శ్రీనివాసు డు
ద్దామకృపాకటాక్షముల దాసుని బ్రోవ దలంపు గల్గుటన్. 18

శ్రీనివాసుని యాజ్ఞ నెఱింగి గరుడు
డచ్చటికి వచ్చి భీముని నతనిసతిని
మోసికొనిపోయె వైకుంఠమునకు తనదు
భక్తులకు వేంకటేశుండు ముక్తి నొసగె. 19

పాదజవంశసంభవునివానిసతిన్ గరుణించి మోక్షమున్
మోదముతోడ నిచ్చితివి ముఖ్యముగా భవదీయబంధుడన్
మేదినినాథుడన్ పయసుమించినవాడను నీదుభక్తుడన్
కాదనబోక మోక్షమిడి కావుము తిర్పతి వేంకటేశ్వరా. 20

అని భూపతి ప్రార్థించిన
విని శ్రీపతి యిట్టు లనియె వేడుకమీరన్.
జనపతి! యుత్తరజన్మం
బున నన్నున్ గొలిచి ముక్తిపొందెద వీవున్. 21

శ్రీనివాసుండు తనతోడ జెప్పినట్లు
స్వామిపుష్కరిణీతీర్థజలమునందు
స్నానమొనరించె నాతొండమాననృపతి
ప్రాతదేహమ్ము విడనాడి పైకివచ్చె. 22

ఈదేహమ్మున తొండమానుడు ధరాధీశుండు పుణ్యాత్ముడై
వేదప్రోక్తవిధానముల్ నెఱపుచున్ విద్యాధికుండయి బుధా
మోదంబొప్పగ శ్రీనివాసుని సదాపూజించుచున్ ముక్తి సం
పాదించెన్ చిరకాలవాంఛితము సంప్రాప్తించె భూస్వామికిన్. 23

అమరలోకమ్మునందున్న యద్రిపైన
కృతయుగమ్మున రమతోడ శ్రీధరుండు
తఱచువనవిహారక్రీడ నెఱపుచుంట
నామహాద్రికి క్రీడాద్రి నామ మొదవె. 24

క్రీడాదిత్రి కెన్ని పేరులు
వాడుదు రవి యెట్లువచ్చె వచియింపుమనెన్
రేడు శతానందునితో
వేడుక నతడు జనకునికి వివరించె నిటుల్. 25

అనుపమవిక్రిముండువృషభాసురు డామలమీద సత్తపం
బొనరిచె విష్ణువుందలచి యుత్తమభక్తివశాంత రంగుడై
వనరుహలోచనుం డతనిభక్తికి మెచ్చివరంబు కోరుకొ
మ్మనె వనుజుండు హర్షమున నంబుజనాభు నుతించి నిట్లనెన్. 26

నీవు మహాబలుండవని నేను నెఱుంగుదు గాన గోరెదన్
దావకమాముకాహపము తామరసాక్ష! మదీయ వాంఛ స
ద్భావముతో గ్రిహించి నను భండనమందు జయింపుమయ్య కృ
ష్ణా! వెఱపింపబోకుము రణంబొనరింతము రమ్ము మాధవా! 27

ముమ్మారుయుద్ధమునకున్
రమ్మని నను బిల్చినావు రాకుండినచో
నెమ్మాడ్కి దలతువో యని
సమ్మతపడి వచ్చినాడ సమరమ్మునకున్ 28

అస్త్రశస్త్రప్రియోగమ్ము లాచరించి
ముష్టియుద్ధమ్ము చేసి రమోఘదీక్ష
సమముగా నుండె నిరువురిశక్తియుక్తు
లలసి వృషభునితో కృష్ణు డనియె నిట్లు. 29

భక్తులన్ సంహరించుట పాడి గాదు
ఘోరపాపాత్ము విడుచుట కూడ దండ్రు
ధర్మసందేహ మొదవె నీతరుణ మందు
శిష్టు రక్షింప దుష్టు శిక్షింపవలయు. 30

సురల మహామునీశ్వరుల చోద్యముగా కడు హింసపెట్టి య
ప్సరలకు మానభంగములు సల్పి దిశాధిపులన్ జయించి మ
చ్చరమున వారిస్థానముల దానవులన్ నియమించి పాపముల్
చొరవగ చేసియుండినఖలున్ నిసు చక్రము నంపి చంపెదస్. 31

భక్తుడవుగాన నీకొక్కవరము నిత్తు
గోరుకొమ్మంచు బలికె వైకుంఠవాసి
వృషభనామకరాక్షసవిభునితోడ
తెలిపె హరికిట్లు తనవాంఛ దితిసుతుండు. 3-

నాకు సుదర్శనంబువలనన్ మరణంబు ఘటిల్లునేని నే
శోకము నొంద నేలయన క్షోణిభవప్రవిముక్తి గల్గు నే
నీకుధరమ్ముపైన నివసించితి పెక్కుదినాలనుండి యో
శ్రీకర నా దుపేర నలరింపుము దీనిని సత్కృపామతిన్. 33

నీవన్నయట్లె యీగిరి
తాపకనామంబు గలిగి ధరణి దనర్చుం
గావుత మని గోవిందుడు
దేవారి ననుగ్రహించె దృఢనిశ్చయుడై. 34

కౌనసించక్రిము ప్రయోగించెన్ మురారి
యనినోడిస్వర్గసుడాయెన్ సురారి. 35

హరివృషభున కొసంగినవరమువలన
నాడుమొదలుగ వృషభాద్రినామ మొదవె
తొంటిక్రీడాద్రికి సమస్తదోషములను
పరిహరించు వృషభాద్రిపర్వతమ్ము. 36

రుద్రవీర్యంబు పండులో భద్రపరచి
వాయు వంజన కిచ్చె తత్ ఫలము నామె
తినియె గర్భమ్ముదాల్చి పావని గనియె
యోనికాలుష్యమించుక లేనిపగిది. 37

అంజనకు బుట్టి పుత్రుడా యద్రిమీద
అందువలన క్రీడాద్రికి నంజనాద్రి
యనెడునామమ్ము సార్ధకమ్మాయె మనము
వినమె దేవాంశ సంభూత జనన కథలు. 38

ఒకపర్యాయము లక్ష్మియున్ హరియు శయ్యోత్సాహులైయుండ వారికి ద్వారంబున కాపుగానిలిచె సర్పేంద్రుండు సౌధమ్ములోనికి బోనెంచుమరుత్ప్రియత్నమునకున్ భేదంబుగావింప దారికి నడ్డమ్ముగ నిల్చె శేషఫణి నిర్భీకంబుగా నత్తరిన్. 39

వాయువు వాయుభక్షకుడు బాహుబలాఢ్యులు వాగ్వివాదముల్
చేయుచునుండ నప్పుడికి శ్రీహరి వచ్చి వచించెనిట్లు మీ
ధ్యేయము నే నెఱుంగుదు మదీయహితోక్తుల నాలకించి యా
మీయభిమానముల్ విడిచి మేలు ఘటించుకొనుండు సమ్మతిన్ 40

చూపుము బలంబు క్రిందాద్రిచుట్టు పట్టి
కదలకుండగజేయు ముగ్రఫణిరాజ
దాని గదలించి ధారుణీతలముమీద
నుంచి నీబలంబును నిరూపించు మనిల 41

వనజాతాక్షునిపలుకులు
విని శేషుడు బహుగుణములనెరిగి మహీధర
మ్మును పట్టుకొనియె దృఢముగ
ననిలుడు కదలింపలేనియట్టివిధమునన్. 42

అనిలుం డాత్మబలంబు పెంచుకొని క్రిందాద్రిం భుజద్వంద్వమం
దున బంధించి కదల్పలేక సురసందోహంబు వీక్షింపగా
గానరించెన్ బహుయత్నముల్ దృఢముగా భూదేవి కంపింపగా
మునులున్ వైష్ణవభక్తవర్యులు మహాత్ముల్ భీతి నల్లాడగన్. 43

బహుదలు బ్రహ్మాదయున్ గలిసి యప్పుడికిన్ బయలెంచి సర్వలో
కములవార్తిబల్ కలుగబుచ స్వకార్యములన్ గానరింపమాని చి
త్తము నగాంతి గల్గగ వ్యధాపరిపీడిత క్రూరి సేవింపు
త్తము విరమింపు మందు సుమనస్కుల వేడి వాయుదేవునన్. 44

నాబలము నిరూపించుసందర్భమిదియె
యిట్టిఆవకాశము త్యజించు టెట్టు లయ్య
పంతము ముగించి తలదించుపగదియేల
యనుచు బృందారకులతోడ ననిలుడనియె. 45

తత్కిరస్కారవచనముల్ తమకు మిగుల
బాధ గలిగింప నిర్జరుల్ పాపమేని
వేడి రాతనిపంతమ్ము విడువుమనుచు
నుడులు వినుటకు శేషుండు పడగనెత్తె. 46

అవకాశంబులభించు చేతడవుగా ఆకాశమార్గంబునన్
పవమానుండు నగంబు పట్టుకొని పోవంగగ్గె మర్త్యోర్వికిన్
పుపుజల్లుల్ గురియించి యిట్లనిరి వేల్పుల్ సర్పరాజంబుతో
భవదీయాపజయంబు గా దిది సురల్ భంగమ్ముగావించుటన్. 47

అంతియెకాదు శేషఫణి అన్యమనస్కత నున్నవేళ నా
పంతము నెగ్గ నేను బలవంతుడ నంచనుభంగి భూమిభృ
త్కాంతుని చేత బట్టుకొని ధారుణి జేర్చుట ధర్మభంగమే
అంతయునీ వెఱుంగు దనిలా! క్షమియింపగ వేడు మాతనిన్. 48

సురవచనసార మెరిగిన
కరువలిశేషఫణితోడ క్షమియింపుమనెన్
నరలోకభయంకరుడగు
నురగపతి క్షమించితినని యొప్పుగ జెప్పెన్. 49

వేంకటాచలనామకపృథ్వీధరము
శేషఫణినాధునకు జనించినదియగుట
ఫణివరుడు దానిచుట్టును బట్టియుంట
శేష నగమని పిలిచి రాక్షితిధరమ్ము. 50

కరుణాపరిపూర్ణ!
సరసిజదళలోచన! ప్రసన్నముఖాబ్జా!
సురసేవితచరణాబ్జ!
కరివరదా! శ్రీనివాస! కమలాకాంతా! 51

ఇది శ్రీమదాంగిరసబార్హస్పత్యభారద్వాజస
త్రియార్షేయప్రవరాన్వితభారద్వాజసగోత్రి
ఆపస్తంబసూత్రియజుశ్శాఖాధ్యాయిబాపనాంబా
కామేశ్వరశర్మపుత్ర బంగారేశ్వరశర్మప్రణీతంబైన
ఉత్తరశ్రీనివాసమునందు తృతీయాశ్వాసము సంపూర్ణము. 52

ఓం వేంకటేశాయ నమః

మంగళం మహత్

శ్రీ శ్రీ శ్రీ

# * కీర్తన *

రచన: శ్రీమతి చెళ్లపిళ్ల లక్ష్మీనరసమ్మ



నావద్దనేవున్నారు వారిద్దరు ఏవొిద్దు
అర్ధనారీశ్వరులు ఆదిమూర్తులువారు
సదయహృదయులై నాహృదయపీఠమునందు ||నా||

శిరమున గంగమ్మ చిందులువేయంగ
గళమునా నాగహారాలు నాట్యమాడంగ ||నా||

అధరాన చిరునవ్వులు చిందించి
హస్తరేఖలునాకభయ హస్తములుగాజేసి ||నా||

శిఖివాహనుండారు శిరసులతోడ
సిద్ధివినాయకుడు స్థిరముగ నొకప్రక్క కొలువుండ ||నా||

ఢమరుకనాదాలు అమరులు సలుపంగ
విమలాంతరంగులు నాహృత్కమలమందు
దర్శనీయులై ఏవొిద్దు ||నా||

సంసార ఘోరగాఢాంధకారాన
నాతోడుగా నిలచి నన్ను కాపాడంగ
కరుణాంతరంగులు ||నా||

| [illegible] | పేజి నెం. | పంక్తి నెం. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 1 | 11 | 8 | పొడిమిని | పోడిమిని |
| 2 | 12 | 15 | నీకు | నాకు |
| 3 | 12 | 17 | సౌధనమున | సౌధమున |
| 4 | 12 | 8 | యుక్తులై | యుక్తులై |
| 5 | 20 | 15 | నేతాౄ | నేతౄ |
| 6 | 38 | 8 | నిట్లనెన్ | యిట్లనెన్ |
| 7 | 40 | 2 | స్వర్గసుడాయెన్ | స్వర్గస్థుడాయెన్ |
| 8 | 40 | 9 | పాపని | పావని |

# ఆత్మ ప్రబోధము

రచన: శ్రీమతి చెళ్లపిళ్ల లక్ష్మీనరసమ్మ

తెలుసుకో తెలుసుకో తెలివిగా మసలుకో
తెలిసినడచుకో నీధర్మం నీవు తెలిసినడచుకో ||తె||

దేవతలు రాక్షసులు లేరెక్కడో దూరంలో
మంచిచెడుల రూపంలో మనలోనేవున్నారు
మంచిని పెంచుకో మనసునుపంచుకో
మర్మమెఱిగి మానవ ధర్మమెరిగి మసలుకో |తె||

అణువణువున దాగివున్న ఆ మహిమేమిటో తెలుసుకో
ఆమహిమవెనుక దాగివున్న దైవాన్నితెలుసుకో
తరచి తరచి నిన్నె నువ్వుచూసుకో
నీలోను దైవమున్నాడని తెలుసుకో ||తె||

మాయయనే మడుగులోనపడి మునకలు వేయకు
ఆత్మయనే జ్యోతినెపుడు ఆరిపోనీయకు
ఆత్మయే పరమాత్మయని అసలుసిసలు తెలుసుకో ||తె||

కోరికలబరువుతోడ కొండమీదికెక్కాలని చూడకు
కోతిచేష్టల్లకొద్దిసేపైన నిలపాలని చూసుకో ||తె.|

లంచగొండితనం ప్రబలెనని లబోదిబోమంటావెందుకు
అడుగని దైవానికిసైతం లంచమిచ్చేగుణం నీలోనేవుందని
తెలుసుకో

నిన్నే నువ్వు తరచి తరచి చూసుకో
నీలోనున్న లోపాలను సరిచేసుకో ॥తె॥

ఆవేశంలో అవివేకంతో నడుగులు వేయకు
నిమిషమైన నిదానించి నిజమేమిటో తెలుసుకో ॥తె॥

నీకు కానిదాన్ని విధిఅంటూ తప్పుకుంటూ
నీకు చేతనైన నీ గొప్పలు చెప్పుకోకు
ద్వంద్వాతీతం మానవజీవిత మర్మమని తెలుసుకో ॥తె॥

తమ సర్వస్వం ధారపోసి తనయుల పెంచు తల్లితండ్రి
వారికంటె నధికులైనున్న తిలోనున్నగాని
తనయులు వినయముతో వారియెడల మెలగాలని తెలుసుకో॥తె॥

మన రామాయణ భారతాలు మనకేమిటి నేర్పేయి
ఓర్వలేనిగుణం ఒరులకన్న మనకే కీడని
ధర్మానికే విజయమ్మని తెలిపాయని తెలుసుకో ॥తె॥

నాదీ నీదని తలచి నమ్మి మోసపోబోకు
నీవెవరో నేనెవరో నిజముతెలుసుకో
చివరకు మిగిలేదేమిటో చూసుకో ॥తె॥

